# పరమదర్శిని.



కావ్యకర్త:

మధురకవి పాలా వేంకటసుబ్బయ్య,

ఆంధ్ర శాసనసభ్యులు.

# ముందు మాట

'పరమ దర్శని' అను నీ చిన్ని కావ్యమును 1948 సంవత్సరమున రచించితిని. సంఘమున కరుడుగట్టుకొని పోయిన కులమత విభేదములను ఖండించి, పరమోత్కృష్టమగు మానవ సేవను పరమావధిగాను, భగవత్సన్నిధానమును కల్పించునట్టిదిగాను, వర్ణించి తదాచరణయోగ్యమగు మనోప్రవృత్తి మానవునియందు సంపాదించుటకు ఆతఁడనుసరింపవలసిన విధానమును అత్యంతస్పష్టముగా ఈ కావ్యమున పంచశీర్షికల క్రింద వక్కాణించితిని.

మొదటిది యగు 'సందేహడోల' యను శీర్షికయందు భగవంతు డెందుగలఁడను విషయమును చర్చించి స్థావరజంగమములకంటె మానవునియందెక్కుడుగాఁ గలఁడనుట రూపించితిని. రెండవ, మూడవ శీర్షికలయందు మానవసేవ, ఆత్మసాక్షి యనునవి చర్చించితిని. నాల్గవశీర్షికయందు ఆశ్రమముల అవశ్యకతను ఉల్లేఖించితిని. ఐదవశీర్షికయందు వెనుకటి విషయముల నవగాహన మొనర్చుకొని ఆచరణయందు బెట్టునెడ గల్గు మార్పును గుఱించి వాకొంటిని.

విప్లవాత్మకమగు మార్పులు మతమునందును, సాంఘిక వ్యవస్థయందును, రావలయుననుట సనాతనులగు వారికి హృదయవిదారకరముగా నుండుననుట నే నెఱుంగుదు. వారు విశాల దృక్పథముతోఁ బ్రపంచముదెస దృష్టి సారించిన నా యొనరించిన సూచనలు, కాలపాత్రానుగుణ్యములనియు, సముచితములనియు బోధపడుననుట నిస్సందేహము.

పాఠకలోకమిూ కావ్యము నాదరింతురేని కడు ధన్యుఁడను.

ఇట్లు,
కావ్యకర్త.

# కృతజ్ఞత



ఈ కావ్య ముద్రణార్థము ద్రవ్య మొసంగిన
శ్రీ Ch. S.R.V.P. మూర్తిరాజు, M L.A. గారికిని,
శ్రీ C.P. తిమ్మారెడ్డి, M.L.A. గారికిని,
నా కృతజ్ఞతా నేక వందనము లర్పించుచున్నాడను.

కావ్యకర్త.

# అంకితము.

శ్రీదామోదర వంశము
హారోదధి సోమా! ఘన చరి-తోజ్జ్వల ధామా!
ఆదర మనోభిరామా!
మోదమునఁగొనుము నాదు - ముద్దుల కృతినిన్. 1

పదియుం దొమ్మిదినూర్లయి-ర్వదియు నొకటి
వర్షమున ఫిబ్రవరినెల - పదియునాల్గు
తేదిఁ బుట్టియుఁ బెద్దలు - మోద మొందఁ
జేరిగి విద్యల నేర్చితి - విశ్రుతముగ. 2

తండ్రి 'మునెయ్య' స్వ-ధర్మ ప్రబోధిత
శాస్త్రార్థముల నేర్పి - సంతరింప,
తల్లి 'సుంకులమ' ప్ర-ఫుల్ల గుణాఢ్య స
ద్ధర్మవిధుల నిర-తంబు గఱప,
చిన్నయాగ్రజుఁడును - చెన్నయ్య మఱి చిన్న
చెన్నయ్య లనుజులై - చెలిమిఁ గూర్ప.
పట్టపరీక్షలో - పట్టంబువడసి 'లా'
యందు నుత్తీర్ణుఁడై - ముందడుగిడి,

దాస్య శృంఖలా విదళిత - ధాత్రి నూత్న
సంవిధాన సభా సంజాత - సభ్యుండయ్యు,
పార్లమెంటు సభ్యుండయి — భవ్యచరితుం
డైతి, సంజీవయ్య జనము - లబ్రబము పడ.

రాజాజీ మంత్రివర్గమ్మున సచివుండై
ప్రజల మన్ననలను — బడసికొంటి,
ప్రథమాంధ్ర మంత్రి వర్గమున ప్రకాశించియు,
బెల్లా మంత్రిత్వముం — బేర్మిం గొంటి,
వర్తమానమున గోపాలరెడ్డి సరస
మంత్రివై మరల సంభావ్యుండైతి,
ప్రజల యాదరణము — ప్రముఖుల యనురాగ
మును చూఱంగొని పురోన్ముఖము గనుచు,

దినదిన ప్రవర్ధమానుండయి — దివ్యకీర్తి
బడసి, సేవాభావన ప్రజలు - వరలుచుంటి,
మంత్రి సంజీవయ్య పుడమి - మంగళముగ;
మెచ్చి కావ్యంబు నంకిత - మిచ్చువాండ.

మాటాడితివ! మృదు — మధుర వాగమృతము
గురిపించి సభికుల — మురియ సేతు,
పాట పాడితివేని - కోడె త్రాచులనైన
నాడింతు రాగర - సార్ద్రగతుల,

కవన మల్లిక వేసి – కమ్రభావముఁ గూర్చి
పఠితల మది పర–వశము సేతు,
లిఖియింతువా! సాటి – లేఖకుల్లేఁను
సంభావనలనంది – సంబ్రపడుదువు,

ఒకయెడ వదాన్యుఁడవయి యిం–కొక్కచోట
గాయకోత్తముఁడ వగుచు – కవియు ననుచు
మంత్రివై రాణ నెలఁగుట – మదినిఁ దలఁచి,
కరము గైకొనఁ గోరె నా – కావ్యకన్య. 5

పదవి గ్రహించినంత సహ–భాగిని యగ్రిక
లమ్మ నైనచో
కొడవలు గూలి గొప్ప యొడ–గూడు నటంచుఁ దలంత్రు
గాదె, యా
యద నొదనంగఁ గూడదని – యాత్మకులంబున
బెంగ్లియాడితో
సదమలమూర్తి సంజీవయ – సద్గుణరాశిని
కృష్ణవేణమన్. 6

ఆయమ భర్తృసేవలకు – నాలయ మంతియ
కాదు సత్ప్రశం
సాయుత జీవితార్థియగు – నట్లుగటం ఘటియించె
మీరలుక

బాయక పెండ్లియాడఁ బర - భామినులతో
'మధుబాలనుం' గలిసి
వ్రాయని 'పాంచజన్యమును' - భవ్య సుదర్శిని,
నాదు పుత్రికిన్.

పత్నులందరు సేవలు - భక్తి సలుప
నాయురారోగ్య భాగ్యంబు - లనవరతము
నొంది సంతానమును బొంది - యుజ్జ్వలముగు
కీర్తి రేఖతో చెలువొంది - కెరలుమయ్య.



# పరమదర్శని.

## సందేహడోల

సర్వమయుఁడగు దేవను - నిర్వచనము
సత్యమే యగు నేమొ, వి-చారణమున
కలవు లేవను శంక మా - తలపు లందు
నిండి తాండవ మాడు సం-దియము బాపు. 1

రాళ్లు సజీవులైన నిలఁ - బ్రాణము లేని విధంబు
నెండ వానలన్
వ్రాళ్లగునే? విశీర్ణమును - బొందునె, నీవు
వసింతు వందురన్
క్రేళ్లురుకంగ భక్తతతి - రేబవళుల్ నిను
బూజ సేయ నె
న్నేళ్లకుఁ గానరావు మఱి - నీకవి నచ్చవొ
ప్రీతిఁ గూర్పవో. 2

తిన్నఁడు పూర్వ మొక్క శిల - దిక్కని నమ్మి
తరించె నంచు వా
కొన్నవి గ్రంథరాజములు, - కొందల మందెడు
చిత్తశుద్ధితోఁ
గన్నులఁ గానుపింపుమని - గాథ నియుక్తి
భజింపఁ బిల్చి యా
పన్నులఁ గావ వేమిటికి? - స్వార్థముఁ గోరి
లిఖించి రేమొకో. 3

భద్రి చిత్రంబునం భక్తిఁ — బదిల పఱచి
ఒకఁడు సాంకేతికంబును — మ్రొక్కుచుండ
నదియె సాక్షాత్కరించు నా - వ్యక్తి యెదుట,
దైవ మనియెంచి యతఁడు తైతక్క లాడు. 4

దైవము దరిశన మిచ్చెను
పావన జన్మండ నైతి - భయ ముడిగె ననున్
భావా విష్కరణమె యని
భావింపఁ డతండు బుద్ధి — పాటవ మంచున్. 5

అంతియె కాని నీవతని — యందుకు వచ్చిన
దేమి లేదు; ర
వ్వంతయుఁ బ్రీతిఁ బుట్టుటకు — నాప్తుల
కీవొకఁ డున్న గాదె యే
తెంతువు; నాస్తికుల్ దిశలఁ — దీరము
లంటఁగ బోధ సేయ నీ
వంతకుఁ గానరా విల మ—దాంధుల
జోలికిఁ బోవఁ గూడదో. 6

అతి బ్రహ్మాండముగా దిశల్ పరవి కొం—
చాశ్చర్య మేపారు నే
క్షితిజం బైనను గానుపింపఁగ నహో!
కేల్మోడ్చి దైనంబుగా
నుతియింపం దొరకొందు రేమిటికి? మా
నుండంచు వాక్రువ్వఁగన్

బతి తోద్ధారకుఁడైన నీకు మదిలో—
వాత్సల్య మొప్పారదే. 7

ఏచి తలర్చి పూచి ఫల — వృద్ధిని గాంచి కుజంబు
దన్పునా
నా చవులం జనాళి నని — సాన్గొను పీడి భజింప,
నిచ్చలున్
దోఁచునె యగ్నులివ్వసుధఁ — దోరము గా
గృహముల్ రచింప నా
లోచన బోవు నేమి? తరులుం గిరులుం
నిజ దేవు లౌదురే. 8

ఔరా! యేమిటి పూజ సేతు విది సా
హార్దంబు నేకొంచ మై
నం రాణింపని ముద్దు మొద్దులను 'నీ—నా'
యంచు మాటాడఁ గా
నోరే లేని మృగంబులు, శిలల సం—
దోహంబులం, బుద్ధిలో
దూరాలోచన సేయ వేమిటని, మా -
ధుర్యంబు గాఁ జెప్ప వే. 9

కొబ్బరి కాయఁ గొట్టి కడు—
కూరిమిఁ బాము నుబూజ జేసినన్
సెబ్బర సేయకుండ దరిఁ — జేరిచి దీవన
లిచ్చు నేమి? నీ

మబ్బు తనంబు గాక యిది — మానక యుండిన
లేదు ముక్తి యం
చబ్బుర పాటు నొందఁ గరు-ణాయుత
బుద్ధిని జెప్ప రాదొకో. 10

భయ జనకంబగు నవి గని
నయ భయములు పెనఁగొనఁగఁ బ్ర-జ్ఞామంబులతో
దయఁ గనుమని పూర్వులు గడు
రయమున మొర్రిక్కుదు రదెంత - ప్రాజ్ఞుల మతమో. 11

సర్వాంతర్యామివిరై
సర్వాచర కోటి యందుఁ - జరియించు నినుఁ
గర్వమునను మదినెంచరు,
దుర్వినియోగంబు బ్రదుకు — తూటాడంగన్. 12

స్థావర జంగమాత్మక వి-చారము సేయుచు
నుండి మానవుల్
జీవుల యందుఁ గొద్దిగను — శ్రేష్ఠజ నొఘము
లందు నెక్కుడై
పూవున నుండు తావిగతి — బుద్ధికిఁ దోఁచుచు
నుండు నిన్ను నీ
లావును గుర్తుఁ బట్టక జ-డమ్ములఁ బూజలు
సేతు రెంచుకో. 13

# పరమదర్శిని.

## మానవసేవ

మానవ జన్మం బుత్తమ
మైనను; పాషాణము వలె - మ్రాకు వలెం జా
నైన మృగము వలె నుండిన
మానవుఁ డనిపించుకొనఁడు - మనుజుఁడు జగతిన్. 14

స్వార్థంబు జంగమ — స్థావరముల నైజ
మగుటచే మనుజుల - కదియుఁ దగదు,
ఆత్మ పరిజ్ఞాన — మాత్మను గల మాన
వుల నైజ మద్దాని — బూన వలయు,
ప్రేమ విరాజిత — హృదయానుభూతియే
ఈశ్వరాంశ మనట — యెఱుఁగు టొప్పు,
ధన మదాంధుల వీడి — ద్రవ్య హీనుల దైన్య
పాటులోఁ దోఁచెడు — పరము దెలియు,

ద్రవ్య దుర్వినియోగ వి—ధానము లిల
జాతరుల, తిరునాళ్ళు, భ—జన లటంచుఁ
దెలిసి పేద సాదల యేడ్పు - తెరల లోనఁ
జూచి పూజించు దేవుని - శుద్ధ మతిని. 15

కుక్క మంచాలలోఁ గూడు — కూడటంచుఁ
కూలఁ బడి యేడ్చు పేదల — గోడు లోన
నిలచి నీసాయమును గోరి — పిలుచు చుండు,
ఈశ్వరునిఁ జూడ గమకించు — మింక నైన. 16

బహు కుటీచీకుండయి పస్తుం - బడెడు వాని,
గుమ్మ గుమ్మముం ద్రొక్కి 'నా—గోడు జూచి
పిడికె డన్నము నిడు' మని — యడుగు వాని,
రోగముల బారి బడి కడు — వేగు వానిం
జూచి కనికరంబునం జేయుం — జాచు వారు
భక్త శ్రేష్ఠులని పుడమి — వరలం గలరు. 17

ఆత్మ వత్సర్వ భూతాని - యనెడు సూక్తి
పఠన మొనరించి హృదయాన — బదిల పఱచి
మదిని, మాటల, క్రియలలో — మఱచి పోక
ఆచరించుటయ గదా! మ-హాత్మ భక్తి. 18

మల్లె పూదావి యొకయెడ - మంచు గుఱియు
పిల్ల గాలులతోం గూడి — వీచు నపుడు
శ్రామికులు బొందు హాయిని - బ్రతుకుం దెఱువు
లేని పేదలం బోషింపం — గాన నగును. 19

మానవు లగు మాల - మాదిగలను జూచి
తొలంగు డంచొక వైపు — దూరుచుండి
కూటికి గుడ్డకు - గోడు గోడున యేడ్చు
దీనుల నొక వైపు - తిట్టుచుండి,
తల దాచు కొనుటకు - స్థల మెద్దియును లేని
పేదల నొక వైపు - వెడలం గొట్టి,
వ్యాధి పీడితులయి - బాధల గ్రమ్మగాడు
వారిని యొక వైపు జేరనీక,

దైవ మందిరములఁ గట్టి, _ ధనము ఖర్చు
వెట్టి నిత్యపూజలు సేయఁ - గట్ట కడకు
ఫలిత మావంతయును లేదు; భవ్యమైన
దీన మానవ సేవయేఁ బూన నగును. 20

కుంటి గ్రుడ్డి కురూపులు – కూటి కొఱకు
నాశ్రయింపఁగఁ 'బో! పొమ్మ'టంచు నిర్ద
యాత్మ పరిలుబ్ధులై వ్యవ–హారములను
దైవ చింతనమును వీడ - ధర్మ మగునె. 21

ధనము దాన ధర్మాదుల – దారిఁ బోక
స్వప్రయోజనమునకు ని–వృత్తమైన
అడవిఁ గాసిన వెన్నెల - యగును గాని
మోక్ష సాధనమున కది - పొందు పడదు. 22

దీన మానవ హృదయ ప్ర-దీప మగుచు
దైవ తత్వంబు భాసిల్లు – ధనికులార!
దయను వారి సంరక్షింప – ధర్మ మగుడు
మొదలు వెట్టుడి దానంబు – మోక్ష మొదవు. 23

తూగు టుయ్యాలలోఁ _ దొయ్యలితోఁ గూడి
సయ్యాటలాడు స–త్సమయ మనుచు,
కారుల మీఁద షి–కారు బయల్దేరి
కాలముం బుచ్చు స–త్కాల మనుచు,

రేడియో పాటల — తోడి నెచ్చెలులతో
నుత్సాహ పడు సుముహూర్త మనుచు
పెండ్లి పేరంటాలు — విందు ఆరగిం
చెడు వేళ కూడదీ - చెడుగటంచు,

పేద సాదల మొఱలు నీ — వినుదోయి
వేసికొనకున్న దైవము — వెడలఁ గొట్టి
దయ్యమును జేరఁ దీయు చం—దంబు గాదె,
కలిమి గల చెలికాడ నీకన్న విప్పు.

నిరుపేద వేడి క—న్నీటి కాల్వలు వాన
చినుకులఁ బడనీక — చితుకఁ గొట్టు,
అనదల జఠరాగ్ని - యారని చిచ్చుగాఁ
గాలు మబ్బుల నెల్ల - గాల్చివైచు,
మొఱకు జనంబుల — మూర్ఖత్వ మీదేశ
విజ్ఞాన సంపదం — వెనుకఁ ద్రోయు,
జాతి భేదములు వై - షమ్యంబు బుట్టించి
సామరస్యంబును — చదియఁ జేయు,

భోగ లాలసులార! సు—బుద్ధి తోడ
దూరదృష్టి వహించి వై—దుష్య మాత్మ
దేశమున జెలరేగ చింతింతు రేని
ఖర్చు వెట్టుడి సద్ధర్మ — కార్యములకు.

పాపము లెన్నియున్న పరిపాటి దొంగల
వర్తనంబులన్
లోపము దిద్దుకొంచు ధర-లో ఋజుగామివి
గాక యున్నచోఁ
గూపము సందుఁ గప్పవలెఁ - గుత్సిత మందె
వసింతు వెప్పుడుం
బ్రాపు నొసంగఁ బోడు భగ-వంతుఁడు
కర్మపు చిక్కు లుండుటన్. 26

రామకృష్ణుఁడు బలుకడే - "ప్రజల యందు
నొకని కేనింత మేలును - వికట మడచి
చేయఁ గల్గినచోఁ గర్మ - సిద్ధి కొరకు
కుక్క జన్మముల్ నూరైనఁ - గొనుదు ననుచు. 27

జాతి మతంబు లన్నియు న-సత్యము
మానవు లెవ్వరేనియు
న్నీతిని వీడకుండిన, మ-నీషత పూజ్యత
నంది ధాత్రినిన్
ఖ్యాతిని గాంతురంచు నను-యాయుల
కెల్ల వచించె కృష్ణుఁడా
రీతిని జీవితంబును ప-రీక్షకు నొగ్గుము
భారతీయుఁడా. 28

అన్య మతములు దక్కువ - యనుచుఁ బల్కి
వారు ఒడు కష్టములఁ జూచి – పారిపోక
ఆదరంబున జూచి సహాయ పడుట
మనుజ ధర్మము, మనమును – మార్చుకొనుము. 29

"భారత జాతియందు నొక – పామరుఁ డేనియుఁ
గూడు గుడ్డకుం
దీరని బాధ నొంద నది – తీర్చెడు కర్మమె
నీకు ధర్మమౌ
కూరుకు సెందఁబోకు" మని – కొండ కొనం
రహి నెక్కి ముక్తి మం
దారమునౌ నరేంద్రుఁడు ఘనంబుగఁ
జాటడె నాఁడు సోదరా. 30

దురిత గుణావలంబు లిల – దూరము నం
దున బెట్టె మాలలం;
హరిజనులంచు నామమిడి – యాప్తులు
వీరని బోధ సేయుచుం
గరమరుదౌ విధమ్ముగ జగమ్ముల వర్తిలె
నాఁడు గాంధి; సా
దరముగఁ జూడ నొప్పడె, ప్రధానము
లైన మహాత్మ బోధలన్. 31

మలము నెత్తెడి వారిని - మానవులని
చూచి చేరఁదీసియు మీఁద - శుద్ధ మాన
సులుగఁ జేయు మహాత్ముండు - తలఁగ కెపుడు
వారి వాడల నివసించి - బడసెఁ గీర్తి. 32

సామాన్య పౌర వర్గపు
క్షేమమె మన లక్ష్యమనుచుఁ - జెప్పెడి నెహ్రూ
గామిడి చేత శ్రమించెను
పామర జనముల నోకించత - భద్రతఁ గనుఁడీ! 33

"నేను మీయింటి కరుదేర - నెనరు వీడి
ఆదరింపక పోయితి" _ రనఁగఁ గ్రీస్తు
యూదు లపుడు "మాయింట ని-రాదరణము
నెపుడు బొందితి" రని యన - యేసుఁ డనియె. 34

"అనుదినంబున మీయింటి - కనద నగుచుఁ
గుంటి, గుడ్డి, క్షురూపిగఁ - గూటి కొఱకు
వచ్చు వాఁడెవ్వ రేనెగాఁ - బావరమునఁ
జూచినారె" యటంచు స-త్సూక్తి గాదె. 35

ధన మదాంధుఁడు దైవ స-దనము సేరు
టొండె, సూది బెజ్జము నందు - నొంటె దూరు
టొండె, పోల్పఁబోలు నటంచు - సువ్వఁ జాటె
నేసుక్రీస్తు మున్నొకపరి - ఎఱుఁగ వలయు. 36

ఎందఱు చావలేదు ధర - నెక్కుచు రొక్కము
　　　　　　　　　　　　ఉన్నవారు నీ
ముందఱ, చిన్ని డబ్బయిన - మూర్ధము నందు
　　　　　　　　　　　　ధరించినారె? నీ
వెందుకు చెడ్డ పేర్వడుదు - విచ్చట పేదల
　　　　　　　　　　　　కూటి లేమిడిం
నిందలు పోవఁ దీర్చి మహా-నీయులు పోయిన
　　　　　　　　　　　　త్రోవ నేగుమా. 37

ధన మశాశ్వత మైనది, - దాని పలన
పెరిగినట్టి శరీరము - పీనుగౌను;
కీర్తి శాశ్వతమైయుండు - నేర్తు వేసి
సాధనము సేయఁగా వలె - సత్వరముగ. 38



# పరమదర్శిని.

## ఆత్మసాక్షి

ప్రకృతి సహజ జనితంబగు
వికృతి విసర్జించి గాదె — వేమన ప్రభృతుల్
సుకృతిని బొందిరి పూర్వము
ప్రకృతి కతీతు లగుచు; మది — భావింపు సఖా. 39

సర్వ భూతము లందున — సంచరించు
జీవుఁడేఁ గద నీలోనఁ — జెలఁగుచుండు
తనువు భేదమె కాని ప్ర—ధాన వస్తు
భేద మేమియు లేదు; భా—వింపుమయ్య. 40

ప్రేమయె సర్వధర్మములు - బేర్కొను సారము, ప్రేమ లేనిచో
నేమత మేని నామమున—కేయగు; సోదరులార బుద్ధిలో
నామన వింత యాదరము—నం బరిశీలన జేసి సత్యము
న్నేమము డటంచుఁ గోరితిని - నూటికినూరు ఫలంబు సేకురన్. 41

సర్వ సమయము లందున — నుర్వి సత్య
వాక్యమును వీడకుండఁ బ్ర—వర్తనముల
దిద్ది తీర్చుకోవలెఁ గాని — తిండిపోతు
లైన లాభంబు గలుగదు — మానవులకు. 42

సత్యమునకన్న తదితర - ప్రత్యగాత్మ
మృగ్యమని నమ్మి సర్వత్ర - యీశ్వరాంశ
భూతులగు దీన జనులకు - బుద్ధిపూర్వ
కముగ సాయంబు సేయుటే - గరము సుఖము. 43

మానవుఁడు ధర పశుత్వము
మానక యుండిన ధ్రువముగ - మరణము వెనుకఁ
గానక పరువిడు చుండును;
హీన గుణంబులను వీడు - హృదయము లోనన్. 44

శాంత శమదమాది సుగుణ - సముదయంబు
గలిగి సర్వ భూతంబుల - నలఘు మతిని
జూచు కొందువయేని గాం-చుదువు శుభము
సర్వ జగతి నీయందుఁ బ్ర-సన్న మగుట. 45

కూలఁదీయును నిను గామ - క్రోధ లోభ
మోహ మద మత్సరంబులు; - ముక్తి యనెడు
అంత్య లక్ష్యంబు దూరమై - హస్తగతము
కాదు; మెలఁకువమై సల్పు - కార్యములను. 46

పాంచ భౌతికమీ తనువు - ప్రాణ మొకటి
వెడల భగ్నమై పోవును - గడియ యందు;
ఆత్మ యొక్కటి కర్మ సి-ద్ధాంతమునకుఁ
జిక్కి పుట్టుచుఁ గిట్టుచు - స్రుక్కు చుండు. 47

పుణ్య కార్యంబులను సేయఁ — బొసఁగు సుఖము
జన్మమెత్తుట చచ్చుట - సాగదప్పుడు,
పాప కార్యంబులను సేయఁ — ప్రబలమైన
దుఃఖములు దాపురించును — ఘోరముగను. 48

సర్వ భూతదయావృత — స్వాంతుఁ డగుచు
అనవరతము నిష్కామంబు — వృత్తులందు
నములు పరచెడు నాతఁడా - ధ్యాత్మికముగ
ధన్యుఁడై దైవము నెఱిఁగి — ధరను బ్రతుకు. 49

సాధన ముక్తికి మూలము
సాధనకగు మూల మిట్టి — జన్మము దలఁపగా
బాధక మీనాఁడయ్యెను
సాధక మొకనాఁడు గాదె — సన్మార్గులకున్. 50

పరమాత్మైక్య విధాన సాధనము సం-
పాదింపఁగా మానవుల్
పరలోకంబుల, భూతకోటులను, నా-
నావస్తు జాలంబులం
పరమార్థమ్మగు స్వీయ రూపమున స-
ద్వ్యాప్తపార పారాయణాప్తిం సదా
దురితంబుల్ దరిజేరనీయక మృదూ-
క్తుల్ గూర్చి కాంచంగనా. 51

అంతర్వాణిని యాలకించి క్రియలం
పార్యక్షముం బోలి నీ
యంతశ్శుద్ధికి హాని లేకటు వివే-
కానందు వాక్యంబులం
సంతోషంబున నెంచి సేయుము దురా-
చారంబుఁ బోనాడు నీ
వెంతో శాంతము నొందఁ గల్గుదువు స-
శ్రేయుండు నిం జేరఁగా.

తుది యెఱుంగని యాశ — మదిని తక్కొక్కొత్తగా
వలదంచుఁ జెప్పెడి — వాఁడొకండు,
తనువుఁ దెలియని క్రోధ వివశాత్ముండు గాఁ
బాడి గాదని జెప్పు— వాఁడొకండు,
దానంబు సేతకు — తటపటాయించనా
పని సేయ పురికొల్పు — వాఁడొకండు,
పర కాంతలను గని — పారవశ్యము సెంద
పాతకమని జెప్పు - వాఁడొకండు.

హృదయ మందున నున్నాడు - వృజిన రాశి
పొంతఁ బోవఁగా నీయఁడు, — బుద్ధిలోన
నెంచి సద్వర్తనంబును — వృత్తులందు
నములు వెట్ట భక్తుండవై — యమలుఁడగుదు.

అంటుకోరాదని - యాటంకమును పెట్టి
దూరాన పొమ్మను - దోష మొకటి,
తక్కువ వాఁడు వేదముఁ జూడ రాదని
మొద్దు ముండల సేయు - మూర్ఖత్వొంను,
ధనము సంపాదింపఁ - దగదను నియమాన
పేద వారిని సేయు - వాద మొకటి,
వారి వారికె గాని - వావి వరుసలని
మత కక్ష్యలను నిల్పు - మౌఢ్య మొకటి,

ఆత్మ పరమాత్మ సంధాన - మమరు నట్టి
సత్య మార్గావరోధమై - సంచరించుఁ
గాన ప్రతిబంధకంబులఁ - గడచి నిత్య
మైన నీ స్థానమును జేర - సనువు వెదకు. 54

స్మృతి శృతు లుపనిష - దితిహాసముల నెల్ల
వల్లించి నడవడి - వదలు దేని,
నీటుగా శ్రీరంగ - నీతులు సభలలోఁ
జాటి సద్వృత్తిని - సలుప వేని,
ఆచార్య వేషంబు - ననయంబుఁ దాల్చియు
దుర్వృత్తులను సేయఁ దొడరు దేని,
దేవాలయంబుల - దైవాభిషేకముల్
సలిపియుఁ బేదలఁ - దలఁప వేని,

పృథివి సథమాథముండవై - పెక్కుమార్గ
జన్మ మెత్తుచు నిడుమలఁ - జావ వలసి
వచ్చుఁ గావున సోదరా! - పావనంబ
వగుము త్రికరణ శుద్ధితోఁ - బనుల సలిపి. 55

మును మనువు రచించిన నీతి - మూల వడియె,
ఆధునిక కాలమున కది - యనువు పడమి,
తద్వచన విధానంబుల - ధర్మమనుచు
బోధనము సేయ నున్మత్తు - బోధ లగును. 56

కాలము బట్టి మార్పులను - గాంచక బిఱ్ఱబిగించుకొన్న యే
పాలక వర్గమేని తుది - భగ్నము నెందెడు భంగి, బాహ్యమై
మూలవిరాట్టు నొందనిది - పూర్తిగ నాశము నెంగఁగావె నీ
వేలము వెఱ్ఱి మాని యిఁక - వేగ మతంబునుదిద్ది తీర్చుమా. 57

కులములు కూలిపోయినవి - కుత్సిత మెల్లెడ నిండి సంకరం
బడుగిడె, పూని సంస్కరణ - లాదర భూత మనంబు తోడుతం
సలుపక, నీ సనాతన వి-చారణ బూనిన నేమి లాభమా
పలుకుమ మానముద్రవిడి - ప్రస్తుత మెయ్యది సల్పభావ్యమో. 58

ధర్మ శాస్త్రముల్ జనుల హి-తంబు నెంచి
బోధ సేయఁగా వలయు, స-ముజ్వలముగ
హితమునకు మాఱు కీడును - సృష్టి సేయు
నవియు ధర్మశాస్త్రములని - యనఁగ నగునె. 59

పరమార్థ మొసఁగు గో-పాలకృష్ణుని గోపి
కాక్రీడ నరుల ము-ష్కరుల సేయు
తత్వ విజ్ఞాన సా-ధనమగు విగ్రహా
రాధన జనుల దు-ర్జనుల సేయు,
ఆర్థిక విజ్ఞాన - మలవడ వర్తించు
కులములు మనుజుల - కుంటు వరచు,
ప్రాపంచిక జ్ఞాన - పరులను గావించు
సంతతులు పాపాల - పుంత లగును,

ఉత్తమోద్దేశములు గల్గి - యుండియు ధర
మానవుల పునీతుల సేయ-రాని గూఢ
శాస్త్రముల వీడి కాలాను - సరణమైన
సత్యమును బోధ సేయుటే - సవ్యమగును. 60

క్రైస్తవ దేశాలు - కలహంబులను బాసి
ఆర్థిక బలముతో - నలరు టేమి?
ముస్లిము రాజ్యాలు - మూలముట్టుగ నైక
మత్యము తోడుత - మసలు టేమి?
చైనా జపానులు - చక్కని యార్థిక
సత్త్వాన ముందుకు - సాగు టేమి?
రష్యను లోకవింత - రక్తిమ నొడగూర్చి
తల మానికంబుగా - మెలఁగు టేమి?

ఒక్కమత మొక్క వేదము - చిక్కు లేని
ధర్మముల నవలంబించి — తనరుట గద!
చూచి యైనను మనము స-దాచరణము
మతములోఁ జేర్చుకుండిన - మాన్యమగునె.

మనుజుల నెక్కు తక్కువలు — మానుట శ్రేయము,
లేనిచోఁ జిరం
తనమగు కక్ష్య లెక్కుడయి — ధర్మ మధర్మము
నై నిరంతరం
బనుభవ వేద్యమైన మన — పాపము లంతును
పంతును లేనివై
కనలెడు రౌరవాదులకు — కారణ మయ్యెడు
చింత సేయుమా.

మానవు లందఱి కొక్కటె
మాన ధన ప్రాణములను — మాన్యపు విధులం
బూని నిసర్గాను గుణ వి
ధానములను సేయుటొప్పు — తమ తమ పనులన్.

ధర్మ సంస్థాప నార్థము — ధర్మ మొందు
వలయు నయ్యాది సర్వాల - భావములకు
సూటిగా నర్థమయ్యెడు — సులభ రీతి
వ్రాయఁ బడవలె వేరైన — ఫలము గలదె?

# పరమ దర్శిని.

## ఆశ్రమములు

### బ్రహ్మచర్యము

బ్రహ్మ చర్యంబు బ్రవిపుల — భావ గరిమ
నిచ్చి కార్యదక్షతఁ గూర్చి — వృద్ధికరము
సేయు నాయుఃప్రమాణంబు — శ్రీకరంబుఁ
గాదె తద్వ్రతమును బూన — కలియుగాన. 65

సామాన్య మానవుల కా
నేమముఁ దాల్పంగ నౌనె? — నిశ్చల బుద్ధి
న్నోమిన వారికె యగునం
చామాన్యపు వ్రతము వీడ — నసమర్థతయా. 66

ఇరువదేడుల ప్రాయంబు - వరకు బ్రహ్మ
చర్యమును బూని విద్యలఁ — జదువ వలయు
జ్ఞాన మార్జింప నదియె ప్ర—ధాన పథము
గాన ప్రతిమానవుడు బూన—గలుగు శుభము. 67

భీష్మ హనుమంతుల విధాన — భీష్మ మగుచు
నవని నాజన్మ బ్రహ్మచ — ర్యంబుఁ బూన
వలదు గాని ఆశ్రమముల — వరుసగా వ
హించి, జన్మ సఫలత గ్ర—హించవలయు. 68

బ్రహ్మచర్య వ్రతంబును — రామకృష్ణ
పరమహంస, నరేంద్రులు — పామరులగు
నరుల కల్యాణమునకు గా - శిరము దాల్చి
సేవఁ జేయరె బోధించి — శిష్ట పథము. 69

మొనమొన్న గాంధీజి - బోధింపడేమి? యా
వ్రతము బూనుమని ప్ర-పంచమునకు
పండ్రెండు వర్షముల్ - బటుతర బుద్ధితో
వహియింప ధీశక్తి-ప్రబలు నిజము,
విద్యార్థి దశయందు - వీతరాగు లగుచు
భక్తిశ్రద్ధలు కన-బరతు రేని
శక్తి సామర్థ్యాన - జటిల సమస్యల
శ్రేష్ఠముగఁ బరిష్క-రింపఁ గలుగు,

అనుభవంబు వలన - గనుగొన్న సత్యంబుఁ
జాటె గాంధి; జగతి — సాటిలేదు
బ్రహ్మచర్యమునకు; — ప్రవిమల మతితోడ
పూనవలయు దాని — పుణ్యులార! 70

గురువుల భక్తి శ్రద్ధలను - గొల్చుచు దైవము రీతిగా మది
న్నిరతము నెంచినట్లయిన — నిశ్చల మానసయుక్తు లౌచు, స
చ్చరితములం పఠించి యొక - సత్కథనంబును సృష్టిసేయరే
భరతచరిత్ర యందది ప్ర-భా సముపేతముగా లిఖింపరే. 71

సౌధంబుఁ గట్టుచో — శ్రద్ధతోఁ బునాది
వేయఁ బూనుట దేమి — వెఱ్ఱితనమొ?
పొలముల విత్తుచో — మున్ముందుగా దున్ని
దుక్కి సేతు వదేమి - దూబతనమొ?
ఫల వృక్షములు నాటు — ప్రీతి యత్నమందున
కంచె వేయుట వేమి — క్రించుదనమొ?
వ్యాపార సంస్థల - ప్రారంభ దశయందు
మూలధనము గూర్ప - మొప్పితనమొ?

కాదు, కాదు, తదాశయా — క్రాంత ఫలము
సాధనము సేయుటకు గదా! - సంతరించు
కొనుట; నీవేల నీజన్మ — గొనబు దేర
బ్రహ్మచర్యంబు నూనవు - ఫలము గలుగ. 72

## గృహస్థము.

బ్రహ్మచర్యాశ్రమంబును - భక్తిఁ బూని
జయము సాధించియును గృహస్థాశ్రమంబు
గొనఁగ వలెగాని యటుగాక - కూర్మి సతిని
ముందు గైకొన సుఖముల - నందుకొనవు. 73

సృష్టిఁబోతు పెంటి యనంగ - జీవు లందు
గల్గి, ఒకటి నొకటిఁ గూడు - కారణమున
వృద్ధి యగుచుండె, మానవ - వృద్ధి కొరకు
యత్న మగు వివాహ మదియు - నగును సేయ. 74

ఆలు మగలు ప్రేమాసక్తు - లగుట కతన
నొకరి నొక్కరు జవదాట - కుండఁ బనుల
నుండు నేకశరీరుల - చందముగను
విధి విధానముఁ దప్పింప - వీలు గలదె.

జీవితమను వన-సీమ బుట్టిన చెల్మి
తీవ బూసిన పూవుల - తీరుగాను,
సంసారమను మహా - సంద్రమ్ముఁ దరియింప
పడవలో జనెడు దం_పతుల రీతి,
శృంగార వినువీధి - చిత్ర భావాలతో
నెగురు పావురముల - వగలు గాను,
పండువెన్నెల యందు - నిండు ముదము నాట
లాడు చకోర ద్వ-యమ్ము గాను,

నుండు రాదంపతులు మహా_నందమునకు
నిలయులై నిరతంబు, స-ఫలము గాదె
యిల గృహస్థాశ్రమ నియమ-ములను బూని
సాధనము సేయఁగా నర - జన్మములకు.

పనుల నిష్కామ వృత్తిపై - గొనుచు; హంస
నీటియందున చరియించు _ నియతిఁ బోలి
గడుపుచుండుట ధర్మము; - కరము ప్రీతి
గలుగు పౌరులకా దంప-తుల యెడలను.

## వానప్రస్థము.

వానప్రస్థాశ్రమమును
బూను గృహస్థాశ్రమంబు - బూర్తియగుచో
మానవ జీవిత మందు న
హీన సుఖమ్ములు ఘటిల్లు - వృజినము లేగున్. 78

భోగ వస్తువులపై - బుద్ధిఁ బోనీయక
కర్మేంద్రియమ్ముల - గర్వమడఁచి,
లోభ మోహాదుల - లోఁగొని బుద్ధి చా
పల్యంబు నెడబాసి - భక్తిగదుర,
ప్రత్యహ భజనలు - భక్త బృందమ్ముల
తోఁగూడి సలుపుచు, - దుష్టజనుల
సాహచర్యంబును - సరస రానీయక
పేద సాధుల సేవఁ - బ్రీతి సలిపి,

జన్మ ధన్యత నొందఁగ - సర్వగతుల
యత్న మొనరింపఁగను తృతీ-యాశ్రమంబు
తోడుపడునయ్యా, తలదాల్చి - దుర్బలమును
బాసి ముందంజ వేయుమ - వ్రతము బూన. 79

నేను నేనను దంభము - నీటఁ గలిపి
నాది నాదను మమకార - ఛేదనంబు
సలిపి, నిత్య సత్యక్రియా - చరణమందు
బుద్ధి నిలుపుట కిదియె ప్ర-పూజ్య పథము. 80

శాంతి దాంతియును వహించి - సత్ఫలంబు
తృప్తితోఁ గొనియు భగవ-ద్విద్య గల్గి
దీనమానవ సేవచే - దివ్యమైన
పుణ్య మార్జించు కొనుమయ్య - పూతచరిత. 81

ప్రీతి శరీరాన శ్రీకృష్ణుఁ - డతిథి వోలెఁ
జేరఁ బిలిచిన యంతనె, - చింత వీడి
భక్తి సంస్థిత హృదయ ప్ర-పత్తిఁ గూర్చి
సర్వభూతమ్ము లొకటిగా - సత్కరించు. 82

## సన్యాసము.

భక్తి గుదిరిన వెంట స్వ-భావ సిద్ధ
మైన సన్యాసమును బూని - మానవులకు
సేవఁ జేయుట కొఱకుగా - సిద్ధపడుము
నాల్గవాశ్రమం బదియె మా-న్యం బటంచు. 83

వైరాగ్యంబును గైకొని
పోరాటంబులను బుద్ధిఁ - బోవిడి హృదయం
బారాటంబున జొనుపక
దూరాటన తోడ సలుపు - తుష్టిని సేవల్. 84

సృష్టియంతయు నీవయై - దృష్టిఁ బడిన
వరకు యత్నంబు మానకు - నరుఁడు బాధ
పడుటఁ జూచి, జాలివడి ని-వారణంబు
సేయుటయె నీదు బాధ్యత - స్నేహితుండ. 85

మాలలు మూడిగల్ దగరు – మద్దయ నొందఁగ
నంచు బుద్ధిలో
బాలిశు భావముంగని, శు–భాలకు మెట్టిన
గట్టు నాబడుం
నాలుగవాశ్రమంబుఁ గొని – నాటక మాడుచు
నుండు వారికిఁ
గాఱఁడు శిక్ష వెట్టును ప్ర–గాఢ భయావ
హమైన రీతిగఁ. 36

నిష్కళుషితాంత రంగాన – నీవు కన్ను
లెత్తి చూడఁగ బాధలు – తుత్తునియలు
గావలెను, పాపి శుద్ధుఁడై – ఘనత నొందు,
చూపను పవిత్రమైనట్టి – జ్యోతి వలన. 37

నరుఁడు నాలుగాశ్రమముల – వరుసఁ బూని
అప్పుడప్పుడు సేయఁగా – నర్హమైన
విధుల నెరవేర్చి యన్నిట – వెలితి పడక
యుండి ప్రేమ ప్రసారంబు – నొందవలయు. 38

బ్రహ్మచర్యాన విద్యార్థి – పరుల కష్ట
ములను జూచి చూడనటులఁ – బోయెనేని
వ్రతము భగ్నమగు, గురువు – ప్రాపుఁ బోవు,
విద్య నాశనమగు శాంతి – విఘ్నమగును. 39

అతిథుల, దీన మానవుల — నాపద నొందిన
పేద సాదులం
సతతము ప్రేమఁ జూడక, వి—చారము
సేయక; భోజనాగాలం
కుతుకము జూపుచున్న యెడ — కూలు
గృహస్థుని ధర్మసూత్రముల్
బలితుఁడగుం, బరార్థమున — భంగము
వాటిలు ముక్తి దూరమౌ.

మూఁడవాశ్రమ వాసులు — మూర్ఖులగుచు
ఇహ పరంబుల రెంటికి - యెక్కకుండ
చెడియెదరు, జాతి వైషమ్య — మడఁచి కొనక
అములులోఁ బెట్టినట్లైన — నవనియందు.

మానవ సేవయే గద! ప్ర—మాణము మానవ
జన్మ మెత్తినందునన్
దానను సన్యసించి యటు — ధర్మము మానిన
రౌరవాదులం
గానని వానిభంగి వడి — కాలుదు వెంతయు
నిశ్చయంబుగాఁ
బూనకు మూర్ఖభావము వి—భూషిత
సత్య విజ్ఞాన మందుమా.

# పరమదర్శిని.

## నిష్క్రమణి

ఎవరు? మీదేమి కులము? – వృత్తి యెద్ది?
యనెడు నవసరమే లేదు – వినుతి కెక్కు
బ్రహ్మచర్యాది యాశ్రమ – వాసములను
స్వీకరించిన సోదరా! – పృథ్వి యందు. 93

చూచుటతోడ బోధపడు – శుద్ధముగా
నొకఁడే విధాశ్రమం
బాచరణంబు సేయునని, – ఆవల భేదము
లన్న వేగతం
బై చనఁగావలెం విధి ని–యామకమైనవి కావు;
కావున
న్నీచము భేద మెంచుచు మ–నీషులు మానవుఁ
దిట్టిపోయుటల్. 94

నాలుగాశ్రమములను స-నాతనముగ
సడుపుకొని మీఁదఁ గోలములు - తడువుకొనక
జీవితంబును గడుపఁగా - శ్రేష్ఠమైన
జాతి యేర్పడు భారత - జగతి యందు. 95

నియమిత బ్రహ్మచర్యమును - నేర్పునఁ
దాలిచి బాల బాలికల్
భయమున విద్య నేర్చినను; – భక్తి గృ
హస్థుఁడు దాన ధర్మముల్

నయమునఁ జేయుచుండినను – నాల్గవ
మూఁడవవాఁడు శ్రద్ధనై
జయ జయ మంచు దేశమున – జాతికి
నీతిని నేర్పుచుండినన్. 96

జగతి ధర్మార్థ కామ మో – క్షములు గలుగ
శాశ్వతానంద మొడఁగూర్చు – చరమ లక్ష్య
మట్లు జూచుచు నుండ దే? – యవని భరత
జాతి శాంతి విరాజిత – జ్యోతి వలన. 97

దీన నారాయణులను ప్ర–ధానమైన
భోజనాదులఁ దనియించి – ప్రోది సేయు,
మూర్ఖ నారాయణులకు ప్రా–ముఖ్యమైన
జ్ఞాన దానము సేయుము – సరస జేరి. 98

కలిమి లేములు, సుఖములు – కష్టములును
పొలయు చింతల్ మహోత్సాహ–ములును జనన
మరణముల్ సమానంబని – మానవులకు
బోధ సేయుము ధర్మంబు – పొందువడఁగ. 99

నానా భూత వితాన రూపముననో
నారాయణా! మాదృశుల్
నీ నామంబునుఁ బూజ సేయఁగను నీ
నిత్యాను భావంబు మా

ఈ కవిగారి

# ఇతర రచనలు

| | | |
|---|---|---|
| 1. మనరైతు | (పద్యకావ్యము) | 0–8–0 |
| 2. అనిల సందేశము | ( ,, ) | 0–8–0 |
| 3. శీలవతి | ( ,, ) | 0–12–0 |
| 4. అమరజీవి–బాపూజీ | ( ,, ) | 0–8–0 |
| 5. అనుతాపము | ( ,, ) | 0–8–0 |
| 6. శాంతిదూత | ( ,, ) | 1–0–0 |

## అముద్రిత గ్రంథములు:



| | |
|---|---|
| 1. హరిజనోద్ధరణము | (పద్యకావ్యము) |
| 2. ఖండకావ్యము | ( ,, ) |
| 3. పంజరకీరతారకము | ( ,, ) |
| 4. రాధ | (నాటకము) |
| 5. వ్యాసమంజరి | (గద్యము) |
| 6. కమలనాథ శతకము | ... |
| 7. వాణీశతకము | ... |
| 8. జానకి | (నవల) |

ఈ పుస్తకము వలయువారు:

మధురకవి పాలా వేంకటసుబ్బయ్య, ఎం.ఎల్.ఏ.,

నాగరాజుపేట, కడప.

శ్రీ కైలాస్ ప్రింటింగ్ ప్రెస్, కడప.